# ప్రాతః స్మరణ.

1. ప్రాతః స్మరామి హృది సంస్ఫుర దాత్మతత్త్వం
సచ్చిత్సుఖం పరమహంస గతిం తురీయం।
యత్స్వప్న జాగర సుషుప్త మవైతి నిత్యం
తద్బ్రహ్మ నిష్కళ మహం న చ భూత సంఘః॥

2. ప్రాతర్భజామి మనసా వచసామగమ్యం
వాచో విభాన్తి నిఖిలా యదనుగ్రహేణ।
యం నేతి నేతి వచనైర్నిగమా అవోచుః
తం దేవ దేవ మజ మచ్యుత మాహు రగ్ర్యం॥

3. ప్రాతర్నమామి తమసః పరమర్కవర్ణం
పూర్ణం సనాతన పదం పురుషోత్తమాఖ్యమ్।
యస్మిన్నిదం జగదశేష మఖండ మూర్తౌ
రజ్జ్వాం భుజంగమ ఇతి ప్రతిభాసితం వై॥



# కైవల్యోపనిషత్తు.

చెన్నపురి.

గీతాప్రెస్ నందు ముద్రితము.

ప్రచురణ :— ఉ. రాధాకృష్ణయ్య.

రూ. 0-50

చిన్మయ మిషన్, పాకాల.

చిత్తూరు జిల్లా.

# వి జ్ఞప్తి.

చెన్నపురియందు, పూజ్య శ్రీ చిన్మయానంద స్వాములు, కైవల్యోప నిషత్తును పరిచయపరచుచు, శ్రోతలు కొన్ని ఘన ఉపనిషత్తులను శ్రవణముజేసి యున్నారు గనుక, ఈ అల్ప ఉపనిషత్తు వారికి ప్రశ్నపత్ర మని భావించి ఇందలి విషయముల వారు విశదీకరించ వలసియుండు నని ఆదేశించిరి. తదను సారము కొన్ని భావముల లిఖించితిని. కాళహస్తి యందలి కైలాసాశ్రమ వాసులగు పూజ్య శ్రీ నిత్యానంద స్వాములు దీనిని జూచి, ముద్రించమని సెలవిచ్చిరి. గీతావాణి సంపాదకులగు పూజ్య శ్రీ రామకృష్ణానంద స్వాములు దీనికి కొన్నితొలిపలుకుల జేర్చి, పవిత్రత గలిగించియున్నారు. పూజ్య శ్రీ ప్రేమానంద స్వాములు దీనిని ప్రీతితో పరిశీలించగలిగిరి. సద్గురు పరంపరకు చేరిన ఈ మహాత్ములకు సాష్టాంగ వందనములర్పించి, దీనిని ముముక్షువుల ఎదుట యుంచగలుగు చున్నాను.

కైవల్యోప నిషత్తు అథర్వణవేదమునకు చేరినది. ఇందు ప్రశ్నించు శిష్యుడు, స్వయముగ అనేక మంత్రములను వేదములందు చేర్చగలిగిన అశ్వలాయన మహాఋషి. బోధించు సద్గురువు, జ్ఞానమూలమగు చతుర్ముఖ బ్రహ్మ. విషయమో, శుద్ధ ఆత్మ తత్త్వము. ఇందలి గురుశిష్యుల సంబంధము, కఠోప నిషత్తునందలి నచికేత, యమధర్మరాజులకు సదృశమైయున్నది. ఇందలి భావనాక్రమము అసదృశము. ఉత్తమాధికారులు వీటిని, పఠించుట, చర్చించుట కాదు; స్మరించి, ధ్యానించి, అనుభవించి, ఆనందించి, తన్మయుల చేయగలిగి యున్నవి.

సహృదయు లిట్టి ప్రీతి భావముతో దీనిని స్వీకరించగలరని విన్నపము.

పాకాల
14-9-1961

ఉ. రాధాకృష్ణయ్య,
చిన్మయ సంఘ కార్యదర్శి.

SWAMY SREE RAMAKRISHNANANDA
EDITOR, GITA VANI.

ALLAGADDA
KURNOOL DIST.

# నా ప్రమోద వాక్యాలు.

ఈ కైవల్యోపనిషత్తు సమూలంగా తెలుగులో వివరించిన శ్రీ ఉ. రాధాకృష్ణయ్యగారు వాకాల చిన్మయ సంఘ సంచాలకులు. భారత విఖ్యాత జ్ఞాన యజ్ఞ ప్రచారకులైన శ్రీ చిన్మయానంద స్వాములవారి యెడ విశేష భక్తి భావం కలవారు. శ్రీ స్వామి వారిచే జరుపబడు జ్ఞాన యజ్ఞ ప్రచార కార్యక్రమాలలో విరివిగా పాల్గొంటూంటారు. బహుకాలంగా వీరితో నాకు సద్భావపూర్ణమైన స్నేహ పరిచయం ఉంది. పవిత్రమైన యీ ఉపనిషత్ ప్రసాదాన్ని తెల్గువారికి పంచిన ఆ పుణ్యాత్మునికి నా అనంత ధన్యవాదాలు.

భోజన సమయాలలో భగవద్గీత పదైదవ అధ్యాయాన్ని పఠించుట నేటికాలం పరిపాటి. ప్రాచీన వైదికకాలంలో యీ కైవల్యోపనిషత్తును పఠించే వారట. ఆ విధంగా నిత్యపఠనీయమై విరాజల్లిన ఉపనిషత్తిది. దీని మూర్తి చిన్నదైనా కీర్తి గొప్పది.

మానవ జన్మానికి పరమగమ్యమైన మోక్షాన్ని-బ్రహ్మ ప్రాప్తిని యీ ఉపనిషత్తు సరసంగా సరళంగా సాధన సహితంగా నిరూపించింది.

"నీవు దేవుడవయ్యా" అంటూ లోకంలో ఎవరినైనా ఉపచారంగా పొగడి మనం వానికి తాత్కాలికానందాన్ని కల్గిస్తాము, "ఉపచార వాక్యాలుకాదు; నిజంగా నీవు దేవుడవే" నంటూ ఉపనిషత్తులు నిరూపించి మన నిత్యానంద పూర్ణత్వాన్ని ప్రసాదిస్తాయి.

ఘటాభిమానం వదలితే ఘటాకాశమే మహాకాశం. దేహాభిమానం వదలితే జీవుడే దేవుడు. ముక్తి అంటే మోక్షమంటే, క్రొత్తగా తెచ్చుకొనే వస్తువు కాదు. విడువదగింది విడిస్తేమోక్షం నిత్య సిద్ధమై ఉంది. మోక్ష మనగా విడుపు. త్యాగంతోనే మోక్షమంటూ యీ ఉపనిషత్తు స్పష్టంచేసింది. "భ్రాంతులుడిగిన బ్రహ్మంబుబట్ట బయలు"— అన్నాడు వేమన్న. సాలెపురుగు తాను నేసుకొన్న వలలో తాను తగుల్కోకుండా సంచరిస్తుంది. కాని జీవుడలా కాక "స్వమాయయా కల్పితలోకం" లో తాదాత్మ్యం చెంది, స్వప్నంలోవలె జాగ్రదవస్థలో కూడా "సుఖదుఃఖ భోక్త" అయ్యాడు. మనస్సుతోటి తాదాత్మ్యంవదలితే మనస్సాక్షియైన తానే మాయాసాక్షియైన పరబ్రహ్మం. ఈ మహాబోధ యీ ఉపనిషత్తులో చెప్పబడింది.

ఈ ఉపనిషత్తులోని కొన్ని మంత్రాలవంటి మంత్రాలు ఆయా ఉపనిషత్తులలోను, భగవద్గీతలోను, ఉన్నాయి. ఆంధ్రీకర్త ఆ పోలికలను ఉద్ధరించి ఉదహరించుటలో చూపిన పరిశ్రమ పొగడ దగింది.

జిజ్ఞాసువులు యీ ఉపనిషత్తును మననంచేసి, ఉపనిషదుక్తఫలశ్రుతిని ప్రాపింప కల్గుదురంటూ ఆశిస్తాను. శ్రీ రాధాకృష్ణయ్యగారి సేవారంగం మరింత విస్తారమగు గాక! శుభమస్తు.—

మకాం ఓంకార ధ్యానమందిరం
చిత్తూరు.
26-5-1961.

శ్రీ రామకృష్ణానంద
గీతావాణీ - సంపాదకులు.

శ్రీ గురుభ్యోనమః !　　　　　　　　ఓం నమోభగవతే వాసుదేవాయ !!

# కైవల్యోపనిషత్.

ఓం సహనావవతు, సహనౌభునక్తు, సహవీర్యం కరవావహై,
తేజస్వినావధీతమస్తు మావిద్విషావహై ॥

ఓం శాన్తిః! శాన్తిః!! శాన్తిః!!!

అథాశ్వలాయనో భగవన్తం పరమేష్ఠిన ముపసమేత్యోవాచ ।
అధీహి భగవన్ బ్రహ్మవిద్యాం వరిష్ఠాం ।
సదా సద్భిః సేవ్యమానాం నిగూఢామ్ ।
యయాఽచిరాత్ సర్వ పాపం వ్యపోహ్య
పరాత్పరం పురుషమ్ యాతి విద్వాన్ ॥ (1)

తస్మై సహోవాచ పితామహశ్చ ।
శ్రద్ధా భక్తి ధ్యానయోగాదవైహి ॥ (2)

ఓం. న కర్మణా న ప్రజయా ధనేన
త్యాగేనైకే అమృతత్వ మానశుః ॥
పరేణ నాకం నిహితం గుహాయాం
బిభ్రాజతే యద్ యతయోవిశన్తి ॥
వేదాన్త విజ్ఞానసునిశ్చితార్థాః
సంన్యాసయోగాద్ యతయః శుద్ధసత్వాః ॥
తేబ్రహ్మ లోకేషు పరాన్తకాలే
పరామృతాత్పరి ముచ్యన్తి సర్వే ॥ (3)

వివిక్త దేశే చ సుఖాసనస్థః
శుచిః సమగ్రీవ శిరః శరీరః ॥ (4)

అత్యాశ్రమస్థః సకలేన్ద్రియాణి
నిరుధ్య భక్త్యా స్వగురుం ప్రణమ్య
హృత్పుణ్డరీకం విరజం విశుద్ధం
విచిన్త్య మధ్యే విశదం విశోకమ్ ॥ (5)

అచిన్త్య మవ్యక్త మనన్త రూపం
శివం ప్రశాన్త మమృతం బ్రహ్మయోనిమ్ ।
తథాఽఽది మధ్యాన్త విహీన మేకం
విభుం చిదానన్ద మరూప మద్భుతమ్ ॥ (6)

ఉమా సహాయం పరమేశ్వరం ప్రభుం
త్రిలోచనం నీలకణ్ఠం ప్రశాన్తమ్ ।
ధ్యాత్వా మునిర్గచ్ఛతి భూత యోనిం
సమస్త సాక్షిం తమసః పరస్తాత్ ॥ (7

స బ్రహ్మ స శివః సేన్ద్రః సోఽక్షరః పరమః స్వరాట్ ।
స ఏవ విష్ణుః స ప్రాణః స కాలోఽగ్నిః స చన్ద్రమాః ॥ (8

స ఏవ సర్వం యద్ భూతం యచ్చ భవ్యం సనాతనమ్ ।
జ్ఞాత్వా తం మృత్యు మత్యేతి నాన్యః పన్థా విముక్తయే ॥ (9

సర్వ భూతస్థ మాత్మానం సర్వ భూతాని చాత్మని ।
సంపశ్యన్ బ్రహ్మ పరమం యాతి నాన్యేన హేతునా ॥ (10

ఆత్మాన మరణిం కృత్వా ప్రణవం చోత్తరారణిమ్।
జ్ఞాన నిర్మథనాభ్యాసాత్ పాశం దహతి పణ్డితః॥ (11)

స ఏవ మాయా పరిమోహితాత్మా
శరీర మాస్థాయ కరోతి సర్వమ్।
స్త్రీ యన్న పానాది విచిత్ర భోగైః
స ఏవ జాగ్ర త్పరితృప్తి మేతి॥ (12)

స్వప్నే స జీవః సుఖదుఃఖ భోక్తా
స్వమాయయా కల్పిత జీవలోకే।
సుషుప్తి కాలే సకలే విలీనే
తమోఽభిభూతః సుఖ రూప మేతి॥ (13)

పునశ్చ జన్మాంతర కర్మ యోగాత్ స ఏవ స్వపతి ప్రబుద్ధః।
పురత్రయే క్రీడతి యశ్చ జీవః తతస్తు జాతం సకలం విచిత్రమ్॥
ఆధార మానన్ద మఖణ్డ బోధం
యస్మిం లయం యాతి పురత్రయం చ॥ (14)

ఏతస్మా జ్జాయతే ప్రాణో మనః సర్వేన్ద్రియాణి చ
ఖం వాయు ర్జ్యోతి రాపః పృథివీ విశ్వస్య ధారిణీ॥ (15)

య త్పరం బ్రహ్మ సర్వాత్మా విశ్వ న్యాయతనం మహత్।
సూక్ష్మా త్సూక్ష్మతరం నిత్యం త్వత్త్వమేవ త్వమేవతత్॥ (16

జాగ్ర త్స్వప్న సుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే।
తద్ బ్రహ్మా హ మితి జ్ఞాత్వా సర్వ బన్ధైః ప్రముచ్యతే॥ (17)

త్రిషు ధామసు యద్భోగ్యం భోక్తా భోగశ్చ యద్భవేత్ ।
తేభ్యో విలక్షణః సాక్షీ చిన్మాత్రోఽహం సదాశివః ॥ (18)

మయ్యేవ సకలం జాతం మయి సర్వం ప్రతిష్ఠితమ్ ।
మయి సర్వం లయం యాతి తద్ బ్రహ్మాద్వయ మస్మ్యహమ్ ॥

అణోరణీయా నహమేవ తద్వన్
మహా నహం విశ్వ మహం విచిత్రమ్ ।
పురాతనోఽహం పురుషోఽహమీశో
హిరణ్మయోఽహం శివరూపమస్మి ॥ (20)

అపాణి పాదోఽహ మచిన్త్య శక్తిః
పశ్యా మ్యచక్షుః స శృణోమ్యకర్ణః ।
అహం విజానామి వివిక్తరూపో
న చాస్తి వేత్తా మమ చిత్స దాఽహమ్ ॥ (21)

వేదై రనేకై రహమేవ వేద్యో
వేదాన్తకృ ద్వేదవిదేవ చాహమ్ ।
న పుణ్యపాపే మమ నాస్తి నాశో
న జన్మ దేహేన్ద్రియ బుద్ధి రస్తి ॥ (22)

న భూమి రాపో న చ వహ్ని రస్తి
న చానిలోమేఽస్తి న చాంబరం చ ।
ఏవం విదిత్వా పరమాత్మరూపం
గుహాశయం నిష్కళ మద్వితీయమ్ ॥ (23)

సమస్త సాక్షిం సదస ద్విహీనం
ప్రయాతి శుద్ధం పరమాత్మ రూపమ్ ॥ (24)

ఇతి ప్రథమః ఖణ్డః ।

యః శతరుద్రీయమధీతే సోఽగ్నిపూతో భవతి, సురాపా నాత్పూతో భవతి, బ్రహ్మహత్యా త్పూతో భవతి, కృత్యాఽకృత్యా త్పూతో భవతి, తస్మా దవిముక్త మాశ్రితో భవతి ।

అత్యాశ్రమీ సర్వదా సకృద్వా జపేత్ ॥
అనేన జ్ఞాన మాప్నోతి సంసారార్ణవ నాశనమ్
తస్మా దేవంవిది త్వైనం కైవల్యం పద మశ్నుతే
కైవల్యం పదమశ్నుతఇతి ॥

ఇత్యథర్వ వేదీయా కైవల్యోపనిష త్సమాప్తా ॥

ఓం తత్సత్.

---

# కైవల్యోపనిషత్.

ఓం సహనావవతు, సహనౌభునక్తు, సహవీర్యం కరవావహై,

తేజస్వినా వధీతమస్తు మా విద్విషావహై ॥

ఓం శాన్తిః! శాన్తిః!! శాన్తిః!!!

1. అథాశ్వలాయనో భగవన్తం
పరమేష్ఠిన ముపసమేత్యోవాచ.
అధీహి భగవన్ బ్రహ్మవిద్యాం వరిష్ఠాం
సదా సద్భిః సేవ్యమానాం నిగూఢామ్।
యయాఽచిరాత్ సర్వ పాపం వ్యపోహ్య
పరాత్పరం పురుషం యాతి విద్వాన్ ॥

అథ = పిమ్మట, అనగా, బ్రహ్మవిద్యబడయుటకు యోగ్యత యొసగు, 1. వివేకము, 2. విరక్తి, 3. శమాది గుణసంపత్తి (శమము, దమము, ఉపరతి, తితిక్ష, శ్రద్ధ, సమాదానము), 4. ముముక్షుత్వము, అను లక్షణములను గలిగిన పిమ్మట, అశ్వలాయనుడు, బ్రహ్మదేవుని, (శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడగు గురువును) విధిప్రకార మాశ్రయించి, అనగా, వినయవిధేయతలతో, సమిత్పాణియై, ఆశ్రయించి, మర్యాదాపూర్వక స్థానమున నిలచి, అతనికి మెప్పు కలిగించి, తన యోగ్యత నతడు గమనించి, సంశయముల నడుగుమని సెలవిచ్చినపుడు, ఇట్లు విన్నవించెను.

హే భగవన్ ! విద్యలందు శ్రేష్ఠమగు బ్రహ్మవిద్యను నాకు బోధించుము. అట్టి విద్యను సత్పురుషులు నిత్యనిరంతరము సేవించుచుందురని వినియున్నాను. అట్టి పామరులకు తెలియ సాధ్యముకాని విద్య గనుక, నిది రహస్యమైనది. అనగా సంస్కారిత బుద్ధిచే తెలియదగినది. మిక్కిలి సూక్ష్మ విష యము, గనుక రహస్యము. ఆ విద్య నెఱిగిన, అచిరాత్ = కాలవ్యవధి లేక, తత్క్షణము, సర్వపాపములు నశించును. పాపములనగా, మనసున కలుగుచుండు దురాలోచనలు, కలతల, కంపముల కలిగించు చింతలు, తొలగును. అనగా పరమ శాంతము చేకూరును.

పరాత్పరం = పరమున కంటే పరము. పరమనగా, మనకు అన్యముగ నుండునది. పరాత్పరం అనగా పరము నకు పరము, మనకు అన్యము గాని, భగవంతుడు. బాహ్య మున వెదకిన దొరకడు. అట్టి, పురుషం = దేహమనబడు పురమును, "నవ ద్వారే పురే దేహే," అను నవద్వార ములతో కూడిన దేహమను పురమును, పరిపూర్ణముగ వ్యాపించి, అధిష్ఠించి, చైతన్యయుతముగ చేయుచుండు పురు షుని, యాతి = పొందుచున్నాడు. విద్వాన్ = జ్ఞాని, బ్రహ్మ విద్యను తెలియగలిగిన జ్ఞాని, ఆ పురుషుని పొందుచున్నాడు.

2. తస్మై స హోవాచ పితామహశ్చ శ్రద్ధా భక్తి ధ్యాన యోగా దవైహి ॥

అట్లు వినయపూర్వకముగ తన యభిలాషను వెలిబుచ్చు కొనిన అశ్వలాయనునితో, పితామహః = బ్రహ్మదేవుడు, ఆదిగురువు, ఇట్లు పలికెను. శ్రద్ధ, భక్తి, ధ్యానయోగము లతో ఆలకింపుము. శ్రద్ధ, యనగా, శాస్త్రములందు, గురు వాక్యములందు, సత్యబుద్ధి కలిగి, బోధపొందుట. భక్తి అనగా, స్వస్వరూప అనుసంధానము. స్వస్వరూపలక్షణ భావములందు లోటులేక నిరంతరము వ్యవహరించుట, ధ్యానయోగ మనగా, మనసునందలి చింతలన్నియు మాపి, ఆత్మపరమగు ఏక చింతన కలిగి, ఆ ఏకచింతయు, ఆత్మ యందు లగ్నమగుట ధ్యానయోగమగును. ఇట్లు శ్రద్ధ. భక్తి, ధ్యానయోగముల వలన, సుసంపన్నుడై బోధ పొంద వలెనని బ్రహ్మదేవుని (గురువుయొక్క) ఆదేశము,— హెచ్చరిక !

3. ఓం. న కర్మణా న ప్రజయా ధనేన
త్యాగేనైకే అమృతత్వ మానశుః ॥

ఓం = ప్రణవము. పరబ్రహ్మ నామవాచకము. నిర్గుణ బ్రహ్మమునకు ప్రతీకము. అ. ఉ. మ. లతో కూడి వచ్చు నిశ్శబ్దముతో కలిసి చతుష్పాదమనబడును. శాంతం. శివం, సుదరం, 'అనబడు పరమాత్మకు నామము గనుక మంగళ కరము. ఏకాక్షరమంత్రము. మంత్రరాజము. సర్వ మంత్రములకు మంత్రబల మొసగు తేజో బిందువు. వేద

ములు, ఉపనిషత్తు లుచ్చరించుటకు పూర్వాపరముల స్మరించ వలసిన పరబ్రహ్మ నామము.

కర్మణా + న = కర్మవలనకాదు. కర్మయనగా, యజన, యాజన, అధ్యయన, అధ్యాపన, దాన, ప్రతిగ్రహములు. అనగా, యజ్ఞ, యాగములు, మొదలగు కాయకష్టముల కోర్చి చేయబడు ప్రతికార్యము, జ్యోతిష్టోమాది యాగములు, స్వర్గప్రాప్తినపేక్షించి చేయబడు కార్యములు, పుత్రకామేష్ఠి, మొదలగు సంతానలాభములకొరకు చేయబడునవి. అశ్వమేధయాగములు, రాజ్య, ధన, లాభముల కోరి చేయబడు కార్యములు. వీటివలన లభించదు. నప్రజయా = సంతానమువలన చేకూరదు, ప్రజా అనగా సంతానము. పుత్రకామేష్ఠివలన సంతానలాభము కలిగినను, నిది లభించదు. పుత్రులు కలిగినవారెల్ల సుఖపడుచున్నారని రుజువు చేయజాలము. "పుత్రోత్సాహము తండ్రికి, బుత్రుడు జన్మించినపుడె పుట్టదు." "కొఱగాని కొడుకు పుట్టిన గొఱగామియె కాదు." గనుక, జన్మించిన వంశము గొప్పదగుట వలన గాని, వంశాభివృద్ధి కలుగుటవలన గాని, లభించదు. ధనేన + న, = ధనము వలన లభించదు. ధనికులకు, ధనాభిలాషులకు దొరకదు. ధనమనగా రాగద్వేషముల సమృద్ధితో కూడినదని తెలియవలెను. యజ్ఞఫలమువలన ఐహికసంపద, ఆముష్మిక స్వర్గప్రాప్తి కలుగు గాక. రాజ్యలాభమువలన సంపద చేకూరుగాక, ప్రతికర్మవలన మాన

వుడు లాభమును కోరుచున్నాడు. కాని, కర్మవలన నిది దొరకునది కాదు. త్యాగేన, ఏకేన, అమృతత్వమానశుః- ఏకేన = ఒకటే మార్గము. అనేక మార్గములు లేవు. "అనన్యేనైవ యోగేన"-నిస్సంశయమైన, భ్రమావివర్జిత మైన, అనుమానరహిత మార్గము-ఒకటి కలదు.

త్యాగేన.-త్యాగమువలన, లభించును. త్యాగమనగా,- సంగంత్యక్త్వా, ఫలంచైవ = సత్యాగః, వేటిని త్యాగము చేయవలెననగా, "యజ్ఞ, దాన, తపః, కర్మ," యజ్ఞము చేయుటయందు, సంగము, ఫలమును, కూడ, త్యాగము చేయవలెను. నేను యజ్ఞకర్త, ఐశ్వర్యసంపన్నుడను, యజ్ఞము చేయు భాగ్యము నాకు కలిగినది. యజ్ఞము చేయుచున్నాను. ఇతరులు చేయజాలని కార్యము నేను చేయుచున్నాను. నేను జేయు ఈ యజ్ఞమునలన ఫలము కలుగును. స్వర్గము ప్రాప్తించును. చాలకాలము సుఖ మనుభవించగలను. సంతోషముగ నుండగలను.— అను ఫలాపేక్ష. అటులనే, దానము చేయుటయందు, దానము చేయుచున్నాను. నాకు పుణ్యము కలు గును. తపసు చేయుచున్నాను. పాపములు తొలగును. కర్మ చేయుటయందు, నేను కర్మ చేయుచున్నాను. ఇందుకు ఒక లాభము కలుగ నున్నది.-అను భావములు, అపేక్షలు, తొలగవలెను. వాటిని త్యాగము చేయవలెను. అందువలన

అహంకారము శూన్యమగును. ఆత్మప్రకాశమునకు అవకాశము కలుగును.

అమృత్వమానశుః = అమృత పదవి కలుగును. మృతమనగా నాశము, అంతము. జన్మము కలుగుట, జన్మము వలన మరణము కలుగుట, మరణానంతరము మరల జన్మము కలుగుట,–ఇవి మృతలక్షణములు. ఆత్మజ్ఞానము లేక పోవుట వలన, నేను శరీరము, నేను మేల్కొని యున్నాను. జాగ్రత, స్వప్న, సుషుప్తుల పొందుచున్నాను. సంసారము చేయుచున్నాను. కష్టపడుచున్నాను. సుఖపడుచున్నాను,–అనుటయెల్ల, మృతమునకు చేరినవి. అస్థిరములు. నాశయుక్తములు. ఈ స్థూలశరీరము నేను కాదు. ఇది నాకు దృశ్యము. సూక్ష్మశరీరము నేను కాదు. అది కలిగి పోవుట నాకు తెలియుచున్నది. కారణశరీరము నేను కాదు. అది జ్ఞానము వలన, విచారము వలన లేక పోవుచున్నది. ఈ శరీరత్రయములు, వాటి వలన కలుగు అవస్థాత్రయములు, మృతములు, ఇవి నేను కాదు. వీటిని తెలియు తెలివియే నేను, అని ఎఱుగుట వలన, మృతము అంత్యమై అమృత పదవి కలుగు చున్నది.

3. పరేణ నాకం నిహితం గుహాయాం
బిభ్రాజతే యద్ యతయో విశన్తి।
వేదాన్త విజ్ఞాన సునిశ్చితార్థాః
సంన్యాస యోగా ద్యతయః శుద్ధ సత్వా

తే బ్రహ్మలోకేషు పరాన్తకాలే
పరామృతాత్ పరిముచ్యన్తి సర్వే ॥
(ముండకోపనిషత్తు III-2-6.)

నాకం అనగా ఆకాశము, పరేణనాకం-ఎదుట ఇంద్రియ గోచరమగు ఆకాశమునకు పరమగునది, అనగా హృదయాకాశమున, ఈశ్వరః సర్వ భూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి. గనుక నిహితం = ఉండునట్టి, యున్నదని నిర్ణయించబడినట్టి, గుహాయాం=హృదయగుహ యందు, విభ్రాజతే = ప్రకాశించుచున్నది. యద్ = ఏదో, అట్టి దానిని, యతయః = విచారపరులు, వివేకులు, జ్ఞానులు, ఆత్మజ్ఞులు, విశన్తి = ప్రవేశించుచున్నారు, చేరుచున్నారు. స్వస్వరూపమని నిర్ణయించుచున్నారు.

వారికి ఆధార మేమి? వేదాన్త విజ్ఞాన సునిశ్చితార్థాః= వేదాంతమునగల, విశేష జ్ఞానము యొక్క విచార ఫలముగ, సునిశ్చితార్థాః, చక్కగ, అనుమానమున కాస్పదము లేక, నిశ్చయ తీర్మానము పొందిన వారు. 'అహం బ్రహ్మాస్మి' యను దృఢ తీర్మానము గలవారు, సన్యాస యోగాత్, పైన తెలిపిన సన్యాసయోగమును చక్కగ అవలంబించువారు, అనగా, కర్మచేయుచున్నను, కర్తృత్వాభావము లేక, కర్మఫలాపేక్ష లేక, యుండగల సన్యాసయోగ సహాయమున, యతయః = ఆత్మాన్వేషణులు, విచారపరులు, శుద్ధసత్వాః=

రాజసగుణము, తామసగుణము పూర్తిగ లేని వారు, మలిన సత్వము కూడ లేనివారు, శుద్ధ సాత్వికులు, ఆత్మస్వరూపులు, తే = వారు, బ్రహ్మలోకేషు = ఆత్మావలోకన తత్పరులు, ఆత్మేతరము తెలియనివారు. ఆత్మ ధ్యానమున యుండుట వలన, పరాన్తకాలే = కాలమునకు పరులగుటవలన, ఆత్మ సన్నిధియందు కాలపరిణామము లేదు. కాలము మనః కల్పితము. మనోలీనమైన ఆత్మసన్నిధికలుగును గనుక, కాలమున కతీతముగ నున్నవారు. (పరాన్తకాలే యనగా, ప్రళయమని యెంచినను. ప్రళయమనగా, స్థూల, సూక్ష్మ శరీరములు తొలగి, సుషుప్తియందు, కారణశరీరమనబడు అంధకారప్రళయమునపడుట. అట్టి ప్రళయమున కూడ వారు ఆత్మయందే వెలయు చుందురు గనుక, ఆ ప్రళయము వారిని బాధింపజాలదు.) పరామృతాత్, విశేషమైన అమృత పదవి ననుభవించుచుండుట వలన, పరిముచ్యన్తి సర్వే = అన్నిటిని, పరిముచ్యన్తి, ముచ్యన్తి = దాటి పోవుచున్నారు. పరిముచ్యన్తి = పరిపూర్ణముగ దాటి పోవుచున్నారు. బంధ రహితులగుచున్నారు. సర్వే అనగా, త్రికాలములను, త్రియవస్థలను, త్రిశరీరములను, త్రిగుణములను, వీటివలన కలుగు సంసారమునుండి విమోచనపొందుచున్నారు. వారిని యివి బంధించజాలవు.

శిష్యుడు.—బ్రహ్మజ్ఞానులట్టి పదవి పొందగలిగినచో, పామరులమగు మేము, అట్టి పదవిని పొందలేమా? మాకు

ఉన్నత దశలేదా? తత్త్వమసియని వేదము తెలుపు చున్నది కదా! మేమా పదవి పొందగల మార్గమునుతెలుపుటకై బోధింప వేడుచున్నాను.

గురువు.—చక్కని విచారపరుడవు. మార్గము తెలుపు చున్నాను. ఆలకింపుము.

4. వివిక్త దేశే చ సుఖాసనస్థ
శుచిః సమగ్రీవ శిరః శరీరః॥

5. అత్యాశ్రమస్థ సకలేన్ద్రియాణి
నిరుధ్య భక్త్యా స్వగురుం ప్రణమ్య॥
హృత్పుణ్డరీకం విరజం విశుద్ధం
విచిన్త్య మధ్యే విశదం విశోకమ్॥

6. అచిన్త్య మవ్యక్త మనన్త రూపం
శివం ప్రశాన్త మమృతం బ్రహ్మయోనిమ్॥
తథాఽఽదిమధ్యాన్త విహీన మేకం
విభుం చిదానన్ద మరూప మద్భుతమ్॥

7. ఉమా సహాయం పరమేశ్వరం ప్రభుం
త్రిలోచనం నీలకణ్ఠం ప్రశాన్తమ్॥
ధ్యాత్వా ముని ర్గచ్ఛతి భూత యోనిం
సమస్త సాక్షిం తమసః పరస్తాత్॥.

వివిక్తదేశే=నిర్జనప్రదేశమున, ఏకాంత స్థళమున, శుచిః= కాలకృత్యములు తీర్చి, స్నానముచేసి, శుచియగు వస్త్రముల

ధరించి, సంధ్యావందనాదులచే అతఃకరణ శుచియై, మనసు నందలి మల విక్షేపముల తొలగించు కొని, సుఖాసనస్థ=చేలా జినకు శోత్తరము''లతోకూడిన ఆసనమును ఏర్పరచుకొని, సుఖాసనస్థ = అనుకూలమగు ఆసనము వహించి, (పద్మాస నము, మొదలగువాటిలో, తన శరీరమునకు నొప్పికలుగ జేయని ఆసనము వహించి), సమగ్రీవశిరఃశరీరః = శరీరము, గ్రీవము - మెడ, శిరః - శిరసు, సమః, సమముగనియమించి, (గీత-VI-13) సమంకాయశిరోగ్రీవం ధారయన్నచలంస్థిరః— ఏక స్తంభమువలె, చలించనీయక, నిలువబెట్టి, ధ్యానముచేయ నారంభించవలెను.

అట్లు కూర్చుకొనిన వెనుక, పూర్వవాసనలగు, నేను గృహస్థుని బ్రహ్మచారిని, వానప్రస్థుని, సన్యాసి నను భావ ముల తొలగించుకొని. ఆశ్రమభావములవదలి. - అత్యా శ్రమస్థః - (అనగా, అన్ని ఆశ్రమవాసులు ప్రయత్నించ గలిగిన అభ్యాసమని భావము.) సకలేన్ద్రియాణి - ఇంద్రి యములు పది, - కర్మేంద్రియములు అయిదు, జ్ఞానేంద్రియ ములు అయిదు, దశేంద్రియముల సమష్టియగు మనసును, నిరుధ్య = వశపరచుకొని, నియమించి, విచ్చలవిడి వ్యవహ రింపనీయక, (గీత-VI-12) "తత్రైకాగ్రం మనః కృత్వాయత చిత్తేన్ద్రియ క్రియః''-

స్వగురుం, భక్త్యాప్రణమ్య-స్వగురుం = జ్ఞానబోధచేసిన గురువును స్మరించి, గురువనగా గొప్పది. గురువులకెల్ల మేటి

గురువగు ఆత్మకు, భక్త్యా = స్వస్వరూపానుసంధానము వల్ల వక, ప్రణమ్య, నమ్రతతో, వినయపూర్వక వందనములర్పించి, నమః = నమమ - 'నాది' అను భావమువదలి, మనసును ఆత్మయందు నిలిపి.

హృత్పుణ్డరీకం మధ్యేవిశదం - పుండరీకం = తెల్ల తామర మొగ్గ, వంటి, హృత్ = హృదయ కమలమున, మధ్యే, "పద్మ కోశ ప్రతీకాశం, హృదయంచాప్యధోముఖం" అను హృదయ కమలమున, "తస్యమధ్యేవహ్నిశిఖా" ఆ హృదయ కమల మున మధ్యే, కేంద్రమున, "నీలతోయదమధ్యస్థాత్ విద్యుల్లేఖేవభాస్వరా," నల్లని మేఘముల మధ్యమెరయు మెరపు తీగవలె, దేదీప్యమానముగ ప్రకాశించు, జ్ఞానజ్యోతిని, - విరజం, విశుద్ధం, విశోకమ్, విచిన్త్య - రజం - అనగా దుమ్ము మైల, అజ్ఞానము, ఆవరణము. రజోగుణము - ఇవిలేనిది గనుక విరజం, విశుద్ధం = విశేషముగ శుద్ధమై యుండునది. (శుద్ధసత్త్వమ్) విశోకమ్ = శోకము, తమోగుణము. అజ్ఞాన లక్షణము. అజ్ఞానమున కచ్చట ఆస్పదము లేదు, గనుక శోకరహితం. విచిన్త్య = విశేషముగ చింతించి, సామాన్య చింతలవలనకాదు. ఎందుకనగా, అది - అచిన్త్యం - చింతించ సాధ్యముకానిది. చింతించునదిమనసు. మనసునకు చింతించు శక్తి యొసగునది ఆత్మచైతన్యము. ఆ చైతన్యమును మనసు కనుగొనుజాలదు. ఆత్మసాన్నిధ్యమున మనసు లీనమగు

చున్నది. అట్లు లీనమగుటయే, విచిన్త్య, విశేషముగ చింతించుట.

అవ్యక్తం.—తెలియరానిది. వ్యక్తములెల్ల ఇంద్రియ గోచరములు. ప్రపంచము – పంచజ్ఞానేంద్రియములద్వారా ఆత్మచైతన్యము పొందిన మనసు బహిర్ముఖమై, ప్రపంచమును తెలియగలుగుచున్నది. ఆత్మ, ఇంద్రియ గోచరము కాదు, గనుక, అవ్యక్తమనబడును.

అనన్తరూపం.—ప్రతి రూపమునందు, రూపమునకు అధిష్ఠానమగు ఆత్మశక్తి, అస్తి, భాతి, ప్రియం, అనుభావముల తోనిండి యున్నది గనుక, రూపములెల్ల ఆత్మ. ఆత్మలేక రూపములుండజాలవు. గనుక ఆత్మ అనన్తరూపములాయెను.

శివం.—సర్వమంగళకరము.

ప్రశాన్తం.—తమోగుణ, రజోగుణరహిత శుద్ధసత్వము గనుక ప్రశాన్తం.

అమృతం.—జాగ్రత, స్వప్న, సుషుప్తులకు, స్థూల, సూక్ష్మ, కారణశరీరములకు, జన్మమరణములకు, అతీతము గనుక, అమృతం, నశించు నది కాదు, శాశ్వతము.

బ్రహ్మయోనిమ్.—బ్రహ్మ అనగా సృష్టికర్త, సమష్టి వాసనలరాశి, జన్మ, జన్మాంతరవాసనలకు గర్భము, నిలయము. అన్నివాసనలచ్చట లయించును. మరల సృష్టిపొంది, వ్యాపించి, వ్యవహరించి, జన్మకారణములగు చున్నవి. గనుక

బ్రహ్మయోనిమ్. — తథాఽఽదిమధ్యాన్త విహీనమేకం.
ఆది = పుట్టుక, మధ్య = అస్తిత్వము, అంత్యము = లయించుట ఈ మూడు వ్యవహారములకు ఆధారము, అధిష్ఠానము. సర్వాధిష్ఠానమగు ఆత్మకు, ఈ పరిణామములు లేవు,

ఏకం.—సర్వదృశ్య ప్రపంచ రూప నామ వికారములకు అధిష్ఠానము ఆత్మ. అట్టి ఆత్మ ఒకటి గాని అనేకములు లేవు, గనుక ఏకం.

విభుం. — నియమించు ప్రభువు. సర్వవ్యాపి, అతని కటాక్షమువలన చరాచరబ్రహ్మాండములు వ్యవహరించు చున్నవి. పిండాండ, బ్రహ్మాండముల నియమించు ప్రభువు ఆత్మ.

చిత్.—చైతన్య స్వరూపము. జ్ఞానము. సర్వశక్తులకు శక్తిత్వమొసగు చైత్యము.

ఆనన్దమ్.—శుద్ధసత్వము, విరజం, విశోకం, గనుక మిగిలియుండునది ఆనందము, ఆనందమే ఆత్మ. 'ఆనందో బ్రహ్మేతి విజానాత్.'

అరూపం.—ఎన్ని రూపములు కనబడుచున్నను, రూప ములు ఆత్మకాదు. రూపములు ప్రకాశించుట కాస్పద మొసగునది ఆత్మ. ఆత్మ అధిష్ఠానమున రూపములు కలిగి, మరిగి, పోవుచున్నవి. ఆత్మకు రూపము లేదు. అనేక దీపముల ప్రజ్వాలింపజేయు విద్యుచ్ఛక్తికి రూపము లేదు.

అద్భుతం.—ప్రపంచ విషయములందు రూఢియైయుండు మానవులకు ఈ ఆత్మవైభవము విచిత్రముగ, అద్భుతముగ కనబడగలదు.

పరమేశ్వరం.— ఈశించువాడు. ఆజ్ఞ చేయు వాడు. నియామకుడు, ఈశ్వరుడు. ఈశ్వరుని నియమించువాడు పర మేశ్వరడు. పరబ్రహ్మము.

ప్రభుం.—పరిపాలించువాడు. రక్షకుడు.

ఉమాసహాయం.—శక్తి సహాయముగల వాడు. ఇచ్ఛా శక్తి, జ్ఞాన శక్తి, క్రియాశక్తి, వీటితోకూడిన వాడు. ఈ శక్తికే ఉమాయని, బ్రహ్మవిద్యయని పేర్లుగలవు. ఈ శక్తుల సహాయ మువలన, సృష్టి, స్థితి, లయములు కలుగుచున్నవి. ఈ శక్తి ఈశ్వరునికి అన్యముగ లేదు. దీని వలననే, జాగ్రత, స్వప్న, సుషుప్తులు, భూత, భవిష్యత్వర్తమానములు, సత్వరజస్తమో గుణములు కలుగుచున్నవి. ఈ త్రిపుటిని తెలియునది – త్రినేత్రము – లాయెను.

నీలకంఠం.— నీలమనగా, అగాధము, అగోచరము, ఆద్యంతరహితము. జ్ఞానమును సూచించునది. అనగా జ్ఞాన కంఠం. ఆజ్ఞానమే త్రిలోచనముల ద్వారా ప్రకాశించుచున్నది.

ప్రశాన్తం.—అమనస్కం. చిన్తావిహీనం. పరిపూర్ణం. కొరత లేని పదవి. జ్ఞానసింధు, అశాన్తమున కాస్పదము లేదు.

సమస్త సాక్షిం.—భూత, భవిష్యత్తు, వర్తమానములకు, జాగ్రత్స్వప్నసుషుప్తులకు, సత్వరజోతమసులకు, జన్మమరణ

ములకు సాక్షి. అధిష్ఠానము, మూలాధారము. సాక్షి, అనగా, వ్యవహారములందు పాల్గొనక, పక్షపాతము వహింపక, గమనించువాడు.

భూతయోనిం.-సర్వభూతములు, ప్రళయానంతరము ఆశ్రయించు మూలాధారము. సర్వభూతములు పుట్టుటకు మూలము, నిలయము. అట్టి ప్రభువును-ధ్యాత్వా-ధ్యానించుటవలన, ఏకైక చింతాయుక్తుడై, స్వస్వరూపానుసంధానము కలిగియుండుటవలన' మునిః-మననశీలవాన్, ధ్యానము చేయు యోగి, తమసః పరస్తాత్ గచ్ఛతి.-అజ్ఞానమునకు, అవిద్యకు పరమగు జ్ఞానస్వరూపమును, జ్ఞానపదవిని పొందును.

ఆత్మపదవి పొందినవెనుక అతని స్వరూపమెట్లుండును?

8. స బ్రహ్మా స శివః సేన్ద్రః
సోఽక్షరః పరమః స్వరాట్ ।
స ఏవ విష్ణుః స ప్రాణః
స కాలోఽగ్నిః స చన్ద్రమాః ॥

స బ్రహ్మా- అతడు సృష్టికర్తయగు బ్రహ్మా, జగత్ వ్యవహారమును సృష్టించి, సంసార చక్రమును కలిగించుచున్నాడు. **సశివః** = అతడు మంగళకరమగు లయమును కలిగించుచున్నాడు. సుషుప్తి యను ప్రళయమున సర్వమును లయింపజేసి, దుఃఖముల నివారించుచున్నాడు. సేన్ద్రః = సర్వాణి

ఇన్ద్రియాణి రాజః ఇన్ద్రః, ఇంద్రియములకు ప్రభువై విషయాను భవముల కలిగించు చున్నాడు. సోఽక్షరః.-క్షరమనగా నాశము. అతడు నాశము లేని వాడు. పరిణామముల నెల్ల తెలియు చున్నాడు.

పరమః = అన్ని అనుభవములకు పరుడు. అంటని వాడు. సంబంధపడని వాడు.

స్వరాట్ = తనకు తానే ప్రభువు. అతనిని నియమించు ప్రభువు వేరు లేడు.

స ఏవ విష్ణుః = అతడే విష్ణువు. సర్వవ్యాపి. చరాచర జగత్తు నంతయు వ్యాపించి యున్నాడు.

సప్రాణః = ప్రాణమనగా, శ్వాసనిశ్వాసముల వాయువు కాదు. ఈ శరీరమును చైతన్య యుతము చేయుచుండు శక్తి. ఆ శక్తి లోపించినచో, ప్రాణము పోయెను, దేహమందలి పురుషుడు తొలగిపోయె నని యెంచబడును. అపుడు దేహము శవమగుచున్నది.

స కాలః.-ఆయుసు నిర్ణయించువాడు. త్రికాలము లతని యధీనములు.

అగ్నిః = వైశ్వానరుడు. (గీతా XV-14). "అహం వైశ్వానరోభూత్వా ప్రాణినాం దేహమాశ్రితః, ప్రాణాఽపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధం" అగ్ని స్వరూపము ధరించి, దేహమందలి ఆహారమును పచనము గావించి, దేహమునకు ఉష్ణత్వ మొసగు వైశ్వానరుడు.

స చన్ద్రమాః = అతడే మనసు రూపమున, వివిధ శరీరము లలో వివిధ సంకల్ప వికల్పములు కలిగించు చున్నాడు.

9. స ఏవ సర్వం యద్భూతం
యచ్చ భవ్యం సనాతనమ్ ।
జ్ఞాత్వా తం మృత్యు మత్యేతి
నాన్యః పన్థా విముక్తయే ॥

స ఏవ సర్వం = చరాచర బ్రహ్మాండమంతయు అతడే. జగత్తంతయు బ్రహ్మ మయం. ఇపుడుండునవే కావు. యద్భూతం, యచ్చభవ్యం–ఇదివరకు పుట్టి గిట్టి నవి. ఇక పుట్ట బోవు నవి.

సనాతనమ్.–ఇన్ని రూపనామములు పుట్టి గిట్టు చుండినను, అతడు నిత్యనిరంతరము శాశ్వతముగ, ప్రతిప్రాణియం దున్నాడు. అవిచ్ఛిన్నముగ నున్నాడు.

తం జ్ఞాత్వా.–అట్టివాని నిజతత్త్వము తెలిసినచో, మృత్యుమత్యేతి–మృత్యుం + అతి + ఏతి. మృత్యువును అతి క్రమించుచున్నారు. అనగా, అట్టి జ్ఞానులకు మరణభీతి యుండదు. వారు నిత్యు లగున్నారు. నాఽన్యః పన్థా విముక్తయే = అజ్ఞానజన్య దేహబంధములు, సంసార పాశములు తొలగుటకు వేరుమార్గము లేదు.

10. సర్వ భూతస్థమాత్మానం
సర్వ భూతాని చాత్మని।
సంపశ్యన్ బ్రహ్మపరమం
యాతి నాఽన్యేన హేతునా॥

సర్వభూతస్థమాత్మానం, సర్వభూతానిచత్మని = గీతా VI-29 తెలుపు విషయమునే ఇచట తెలుపబడుచున్నది. సర్వభూతములందు, "అస్తి, భాతి, ప్రియం," అను లక్షణములతో కూడియున్న ఆత్మను, ఆత్మ తన విశ్వవిలాసమునందు, జీవరాసులరూపమున చైతన్యయుతమై సంచరించ గలుగుటను, సంపశ్యన్ = సమ్యక్ + పశ్యన్, చక్కగా నెఱిగి, విజ్ఞాన విమర్శవలన తెలిసి, పరమంబ్రహ్మ = పరమాత్మను, పురుషోత్తముని, యాతి = పొందుచున్నారు. నాఽన్యేన హేతునా = వేరు ఉపాయమువలన కాదు. వేరుమార్గము లేదు.

11. ఆత్మానమరణిం కృత్వా
ప్రణవం చోత్త రారణిమ్।
జ్ఞాననిర్మ థనాభ్యాసాత్
పాశం దహాతి పణ్డిత॥

ఆత్మానం=మనసును, అరణిం=యజ్ఞములందు అగ్నిని కలిగించుట కుపయోగించబడు క్రింది కొయ్యతుండుగను, కృత్వా=సంకల్పించుకొని, ప్రణవం=ఓంకారప్రణవమంత్రమును, చ=జతపరచి, ఉత్తరారణిం=చిలుకుట కుపయో

గించబడు కర్తవ్యముగను సంకల్పించుకొని, జ్ఞాననిర్మథనాభ్యాసాత్ = చిలుకుటయను జ్ఞానాభ్యాసమువలన, నిరంతర ధ్యానమను ప్రయాసవలన, పణ్డితః = పూర్ణజ్ఞాని, పాశం = సంసారమనబడు అజ్ఞాన పాశములను, దహతి = కాల్చివేయుచున్నాడు. బంధరహితుడగుచున్నాడు. మోక్షము పొందుచున్నాడు.

ఈ బంధము లెట్లు కలిగినవి ?

12. స ఏవ మాయా పరిమోహితాత్మా
శరీరమాస్థాయకరోతిసర్వమ్ ॥
స్త్రీయన్నపానాది విచిత్రభోగైః
స ఏవ జాగ్రత్పరి తృప్తిమేతి ॥

స, ఏవ = ఆపరమాత్మాయే, మాయా పరిమోహితాత్మా = మాయ అను అవిద్యవలన, మిక్కిలి మోహావశుడై, జీవుడని భ్రమించుచు, శరీరమాస్థాయ = శరీరమును స్థానముగ చేసుకొని, శరీరమున నివసించుచు, సర్వమ్ కరోతి = అన్ని కార్యములు చేయుచున్నాడు. ఏ కార్యము లనగా, స్త్రీ = పురుషుడు స్త్రీయందు సుఖమున్నదని, స్త్రీ పురుషునియందు సుఖమున్నదని, భోగముల ననుభవిచుచు, అన్నపానాది విచిత్రభోగైః = అన్నము, పానము, మొదలగు అనేకవిధ భోగముల వివిధ రీతుల ననుభవించుచు, సుఖపడుచున్నానని భ్రమించుచు, అవి లేకున్న దుఃఖపడుచు, స ఏవః = జీవుడనబడు ఆ పర

మాత్మయే, జాగ్రత్పరితృప్తిమేతి=స్వప్నములందు భయముల ననుభవించుచు, సుషుప్తియందు వ్యవహార శూన్యుడై, ప్రళయ మావరించగా, పూర్వవాసనలబలమువలన జాగ్రత్త పొందినవాడై, స్వప్నములన్నియు తొలగుటచే, తన యునికి యందున్నానని, మెలకువ, స్వప్న, సుషుప్తులు తన కన్యమని, వాటితో తనకెట్టి బాధలు కలుగలేదని, అధిక తృప్తి ననుభ వించుచున్నాడు.

స్వప్న, సుషుప్తు లెట్లు కలుగుచున్నవి ?

13. స్వప్నే స జీవః సుఖదుఃఖ భోక్తా
స్వమాయయాకల్పిత జీవలోకే।
సుషుప్తి కాలే సకలే విలీనే
తమోఽభిభూతః సుఖరూపమేతి॥

సః=ఆ పరమాత్మయే, జీవః=జీవభావము పొంది, స్వప్నే=స్వప్నమున, నిదురయందుత్పన్నమైన, సుఖదుఃఖ భోక్తా=సుఖముల, దుఃఖముల ననుభవించు వాడగుచున్నాడు. ఆ సుఖదుఃఖములు నిజముగ లేవు. మనఃకల్పితములు. స్వమాయయా=తనయొక్క జ్ఞానము, నిద్రామత్తువలన మరుగు పడగా, అవిద్య యను మాయాశక్తి ఆవరించగా, తత్ఫలిత ముగ, కల్పిత జీవలోకే=మనస్సంకల్పమువలన తానుగా కల్పించుకొనిన స్వప్న జీవలోకమును తెలియుచున్నాడు. అనుభవించు చున్నాడు. సుషుప్తికాలే=సుషుప్తి, అను

నిద్రపూర్తిగ ఆవరించగా, మనసు లయముపొందగా, జ్ఞాన ప్రకాశము లేకపోగా, ప్రళయము కలుగగా, స కలే విలీనే= అన్నివిధ అనుభవములు, భావములు, ద్వంద్వములు, సుఖ దుఃఖములు తెలియకపోగా, తమోఽభి భూతః=అజ్ఞానమను దట్టపు ప్రళయచీకటి క్రమ్ముకొనగా, సుఖరూప మేతి=తన నిజరూపమగు సుఖమును, ఆనందస్థితిని పొందుచున్నాడు. ఆత్మ, సత్తు, చిత్తు ఆనంద స్వరూపము. ఆనందో బ్రహ్మ. అట్టి ఆనందమును సుఖమును తాననుభవించుచున్నాడు. కాని, పరికించగల బుద్ధి వ్యవహారములణగిపోయి యుండుటవలన, తన నిజసుఖస్వరూప మును తాను తెలియలేకున్నాడు.

అటులయినచో, మరల జాగ్రతావస్థ ఏల కలగుచున్నది?

14. పునశ్చజన్మాంతర కర్మయోగాత్
స ఏవజీవః స్వపితిప్రబుద్ధః
పురత్రయే క్రీడతి యశ్చ జీవః
తతస్తు జాతం సకలం విచిత్రమ్
ఆధారమానన్దమఖణ్డబోధం
యస్మింల్లయం యాతిపురత్రయంచ ॥

పునః+చ=మరల కూడ, ఎన్ని పర్యాయము లీ అనుభవ ములు పొందుచుండినను, విసుగులేక, జన్మాంతరకర్మ యోగాత్=జన్మ జన్మాంతర సంచిత కర్మఫలనియమాను సారమున, స ఏవ జీవః=ఆ పరమాత్మయే, జీవభావము

వదలలేక, స్వపితి=సుషుప్తినుండి, జారి, స్వప్నములు పొందుచు, మరల, ప్రబుద్ధః=జాగ్రతావస్థ పొందుచున్నాడు.

పురత్రయే=మూడు పురములగు, స్థూల, సూక్ష్మ, కారణశరీరములందు, యః=ఎవడు, చ=నిరంతరము, జీవః= ఆ జీవుడు, తతః=అచ్చటచ్చటి, ఈ వేరువేరు శరీరములలో, జాతం=కలుగుచుండు, విచిత్రమ్=విశేష చిత్రములైన, సకలం=అనుభవముల నెల్ల క్రీడతి=ప్రీతితో రమించు చున్నాడు. ఇవి దుఃఖరూపములని యెంచక, సుఖములని తలచి, సంతోషపడుచున్నాడు. వీటిని వదలలేకున్నాడు. వీటిని వదలిన సుఖములేదని యెంచుచున్నాడు. ఆధార మానన్ద మఖణ్డబోధం=నిజము విచారించినచో, తన స్వరూప మెట్టి దనిన, ఈ క్రీడలకు, ఈ విచిత్ర అనుభవములకెల్ల తాను ఆధారము. తన ఆధారము లేకున్న ఇవెల్లకూలి పోవును. మరియు, తాను అఖండానందము. తన ఆనంద స్వరూపమున కొరత ఎన్నటికిని లేదు. దుఃఖ మున కాస్పదములేదు. ఈ సుఖములను, దుఃఖములను తెలియు తెలివియే తాను, అఖణ్డబోధం. అన్నిటికి అధిష్ఠా నము. చ=మరియు, యస్మిం=ఎచ్చట, పురత్రయం= ఈ స్థూల, సూక్ష్మ, కారణశరీరములు, లయం=అణగిపోవుట, యాతి=పొందుచున్నదో, అట్టి, అధిష్ఠానమతడు. నేను జీవుడు, కేవల పరాధీనుడనని హీన భావము పొందుచున్నాడు.

జీవుడే పరమాత్మయైనచో, ఈ విశ్వమునంతయు నత డెట్లు సృష్టించెను ?

15. ఏ తస్మాజ్జాయతే ప్రాణో
మనః సర్వేన్ద్రియాణి చ
ఖం వాయు ర్జ్యోతిరాపః
పృథ్వీ విశ్వస్య ధారిణీ ॥

ఈ మంత్రము, ముండకోపనిషత్తునందు (II–1–3) వెలయుచున్నది. ఏతస్మాజ్జాయతే ప్రాణః=అతడు తన స్వస్వరూప జ్ఞానము కోలుపోవుటవలన, జీవభావము పొందుట వలన, అతని అధిష్ఠానముచేత, ఈ మృణ్మయ దేహమున చేతనము కనబడుచున్నది. అది యే ప్రాణ మనబడును. ప్రాణము పోయిన దనగా అతని అధిష్ఠానము తొలగినది యని భావము. అపుడు ఈ శరీరము శవమని యెంచబడును. అతని అధిష్ఠానము వలన కలిగిన ప్రాణమున సంకల్పశక్తి కలిగెను. అనగా, మనసు ఏర్పడెను. మనసు వలన, జ్ఞానేంద్రియములు అయిదు, కర్మేంద్రియము లైదు, ఏర్పడెను. కర్ణములు, చర్మము, నేత్రములు, జిహ్వా నాసిక, ఇవి జ్ఞానేంద్రియములు. వినుట, స్పర్శించుట, చూచుట, రుచిగనుట, వాసన తెలియుట, వీటి కార్యములు. శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము, వీటి విషయములు. ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వీ, ఈ విషయములకు మహాభూతములు. వీటితో విశ్వబ్రహ్మాండ మంతయు నిండియున్నది. ఈ విశ్వ

బ్రహ్మాండమునకంతయు, ఆదికారణము, ఆధారము, అధిష్ఠాన ముగ నుండునది, జీవభావముతో నొదిగియుండు పరమాత్మ. గీతా XV–9. "శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణ మేవ చ, అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే," అని తెలుపబడినది.

'తత్త్వమసి' ఆ పరబ్రహ్మమే నీవు అను వేదము నందలి మహావాక్యమును గురువు ఇక బోధించుచున్నాడు.

16. యత్పరంబ్రహ్మ, సర్వాత్మా
విశ్వస్యాయతనం మహత్ ।
సూక్ష్మాత్సూక్ష్మతరం నిత్యం
తత్త్వమేవ త్వమేవ తత్ ॥

యత్ = ఏది, పరంబ్రహ్మ = సర్వోత్కృష్టచైతన్యమో, సర్వాత్మా = విశ్వవ్యాపియో, ప్రతిజీవియందు ప్రకాశించు ఆత్మచైతన్యమో. విశ్వస్య మహద్ ఆయతనం = బ్రహాండ మునకు గొప్ప ఆశ్రయమో, ఉనికి, నిలయమో, సూక్ష్మాత్ = సూక్ష్మమునకంటే, సూక్ష్మతరం=విశేషసూక్ష్మమో, ఆకాశ మతిసూక్ష్మము. ఆకాశమునకన్న ఆత్మ సూక్ష్మతరమై, ఆకాశమునకు కూడ నిలయమై యున్నది. నిత్యం = శాశ్వ తము. ఆది అంత్యములులేక, ఆది అంత్యములకు నిలయమై, అంటక, సాక్షివలె నున్నది. తత్ + త్వమ్ + ఏవ = అట్టి

సర్వోత్కృష్టచైతన్యము నీవు. సంశయము లేదు. త్వమ్ + ఏవ + తత్ = నిస్సందేహముగ నీవే అది. ఇచట "నీవు" అనగా, ఏమిటో విశేషించి తెలియవలెను. ఇది బోధక వాక్యము. గురువు శిష్యునికి బోధించుచున్నాడు. విచారమును అనేకవిధముల పరోక్షమున వివరించుచు, కడకు, అది పరోక్షమున, నీకు అన్యముగ లేదు నీవే అది. అదే నీవు. రెండు ఒకటి, అద్వితీయము, అని గురువు బోధించుచున్నాడు. అది, నీవు, రెండు ఒకటి అని నిశ్చయించుటయందు, సర్వ విచారములు కూడి యున్నది. భ్రమలకు ఆస్పదమై యున్నది. ఈ "నీవు" అనబడునది, దృశ్యమగు దేహముకాదు, అందలి కర్మేంద్రియములుకావు. జ్ఞానేంద్రియములుకావు. మనసు కాదు, బుద్ధికాదు. కనబడని సూక్ష్మశరీరముకాదు. గోచరముకాని కారణశరీరముకాదు. జాగ్రత, స్వప్న, సుషుప్తులుకావు. సత్వ, రజస, తమోగుణములుకావు. ఇన్ని కాకపోయినను, ఇన్నిటికి రూపనామక్రియలు కలిగించు సూక్ష్మచైతన్యమును సూచింపబడుచున్నది. ఇదివరకు ఆ చైతన్యము వర్ణించబడినది. ఆ చైతన్యమే నీ దేహోపాధి యందు ప్రకాశించుచున్నది. ఆ ప్రకాశమే నీవు.

గనుక, "అయమాత్మా బ్రహ్మ" మని బోధించుచున్నాడు.—

17. జాగ్రత్స్వప్న సుషుప్త్యాది
ప్రపంచం యత్ప్రకాశతే ।

తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా
సర్వ బన్ధైః ప్రముచ్యతే॥

జాగ్రత అనగా స్థూలదేహమున అభిమానము, దశేంద్రియ వ్యవహారములు, నేత్రస్థానము. వైఖరీవాక్కు, సత్వగుణ ప్రధానము, కలిగి, విశ్వుడను నామముతో, జీవుడుగ వ్యవహరించు పరమాత్మలీల.

స్వప్నమనగా. సూక్ష్మదేహాభిమానము కలిగి, మనో వ్యవహారము, కంఠస్థానము. మధ్యమవాక్కు, రజోగుణ ప్రధానము కలిగి, తైజసుడను పేరుతో, స్వప్నవ్యవహారములు సలుపు పరమాత్మలీల. సుషుప్తియనగా, కారణదేహాభిమానము, (అజ్ఞానము), వ్యవహారరహితము, హృదయస్థానము, పశ్యంతివాక్కు, (వ్యవహరించక చూచునది-సాక్షి), తమోగుణ ప్రధానము, ప్రాజ్ఞుడను పేరుతో నిద్రయందలి సుఖానుభవములు పొందు పరమాత్మ లీల.

పంచమహాభూతములు, వాటి పంచతన్మాత్రలు, పంచ జ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, వీటి వ్యాపారములు, పంచేంద్రియవిషయములు, అన్నియు కలిసి, ప్రపంచమాయెను. ఈ ప్రపంచమున కంతయు, ఆత్మ చైతన్యమొసగుచున్నది. ప్రతిజీవియందు, ప్రతివస్తువునందు ప్రకాశించు చైతన్యము ఆత్మ. ఆ యాత్మయే నేను. ''నేను'' లేక ఇవి యొకటియు ప్రకాశించ జాలవు. ఆ ప్రకాశమును

బ్రహ్మ మనబడును, ఆ బ్రహ్మమే "నేను." "నేనే" ఆ బ్రహ్మము. ఇతి జ్ఞాత్వా = అని తెలిసినచో, సర్వబన్ధైః = అన్నివిధ బంధములు, పాశములు, ప్రముచ్యతే = ప్రకర్షేణ ముచ్యతే = పూర్తిగ, నిశ్శేషముగ తొలగిపోవుచున్నవి.

ఇక, "ప్రజ్ఞానం బ్రహ్మ" మని బోధించుచున్నాడు.

18. త్రిషు ధామసు యద్భోగ్యం
భోక్తా భోగశ్చ యద్భవేత్ ।
తేభ్యో విలక్షణఃసాక్షీ
చిన్మాత్రోఽహం సదాశివః ॥

త్రిషు ధామసు = మూడు నిలయములందు, అనగా, శరీర త్రయములందు, స్థూల, సూక్ష్మ, కారణశరీరములందు ఎత్, ఏది, భోక్తా = అనుభవించు, కర్త యని, భోగ్యం = అనుభవించడమనుక్రియ యని, భోగః = అనుభవము అనుకర్మ యని, యద్ + భవేత్ = ఏవికలవో, మూడంశములకు, తేభ్యో + విలక్షణః = వీటికి వ్యతిరేక లక్షణములుగల, సాక్షీ = వాటియందు జోక్యము కలిగించుకొనక, మమకారము పొందక, ఏదికలదో, తత్ = అది, ఆ, చిన్మాత్ర, చైతన్యము, అహం = "నేను." ఆ ఎఱుకయే నేను. సదాశివః = నా స్వభావము ఎట్టిదనిన, నిత్యనిరంతర మంగళకరము. ఆనందస్వరూప ఆత్మ—"నేను." ఒక నాటకరంగమున, సభ్యులువచ్చి ఆసీనులగుట, నటులు నాట్యమాడుట,

సభ ముగియగా, మిగులు నిర్జననాటకరంగమును కూడ ప్రకాశింప జేయుచు, వికారములు చెందని, దివ్యజ్యోతి వలె ఆత్మ సర్వసాక్షిగ నున్నాడు.

ఇక "అహంబ్రహ్మాస్మి" అను మహావాక్యబోధ ప్రారంభ మగుచున్నది.

19. మయ్యేవ సకలం జాతం
మయి సర్వం ప్రతిష్ఠితమ్!
మయి సర్వం లయం యాతి
తద్బ్రహ్మాఽద్వయ మస్మ్యహమ్ ॥

మయ్యేవ = నాయందే. నా అధిష్ఠాన బలమువలన, సకలం + జాతం = సర్వము సృష్టిపొందుచున్నవి. జాగ్రత, స్వప్న, సుషుప్తులు నాయందు కలుగుచున్నవి. మయి సర్వం + ప్రతిష్ఠితం = అన్ని నాయందు నిలచి యుండును. మయి సర్వం లయం యాతి = నాయందు అన్నియు లీనమై పోవుచున్నవి. తత్ = అందువలన, బ్రహ్మ + అద్వయం + అస్మి + అహం = ఆ అద్వితీయ బ్రహ్మము నేనైయున్నాను. బ్రహ్మమునకు నాకు వ్యత్యాసము లేదు.

20. అణోరణీయానహమేవ తద్వన్
మహానహంవిశ్వమహంవిచిత్రమ్ ।
పురాతనోఽహం పురుషోఽహమీశో
హిరణ్మయోఽహంశివరూపమస్మి ॥

అణోః=అణువులలో, సూక్ష్మములలో, అణీయాన్= సూక్ష్మము, అహమేవ = "నేనే" తద్వత్ = అటులనే. మహానహం=గొప్పవాటిలో నేను గొప్ప. (కఠోపనిషత్ I-2-20) అణోరణీయాన్మహతో మహీయాన్.—అని యున్నది.—విచిత్రమ్+విశ్వం+అహం=విచిత్రమగు విశ్వమంతయు నేను. పురాతనోఽహం=నాకు పుట్టుక లేదు. క్రొత్తగ పుట్టిన వాడనుకాను. నిత్యుడను. గనుక పురాతనుడను నేను, పురుషోఽహం=ఈ శరీరమనబడు పురమును నిండి యున్నాను. ఈశః=నియమించువాడను. హిరణ్మయః + అహం = నేను తేజస్స్వరూపుడను. శివరూపమస్మి =మంగళస్వరూపుడను. మంగళకరుడను. ఆనందము నా లక్షణము. అమంగళమునకు, దుఃఖమునకు నా యందు ఆస్పదము లేదు.

21. అపాణి పాదోఽహమచింత్యశక్తిః
పశ్యామ్యచక్షుః శృణోమ్యకర్ణః।
అహం విజానామి వివిక్తరూపో
న చాస్తి వేత్తా మమ చిత్సదాఽహమ్॥

ఈ విషయము కఠోపనిషత్తునందు "అశరీరం శరీరేషు," అనియు, "ఆసీనోదూరంవ్రజతి, శయానో యాతి సర్వతః" అనియు, కేనోపనిషత్తునందు "శ్రోత్రస్య శ్రోత్రం, మనసో మనో యద్" అని యుకలదు.

అహం="నేను", అపాణిపాదః=చేతులు, పాదములు లేని వాడను. అనగా, ఈ చేతులు, పాదములు, నేను కాదు. అచిన్త్యశక్తిః=అట్లుండియు విశేషశక్తి గలవాడను. నాశక్తి ఎట్లు వ్యవహరించునో నిర్ణయించ సాధ్యము కాదు. "బుద్ధిః గ్రాహ్య మతీన్ద్రియం," ఎందుకనగా, అచక్షుః= కన్నులు లేకనే, పశ్యామి=చూడగలను. అకర్ణః=చెవులు లేకనే, సశృణోమి=చక్కగ । వినగలుగుచున్నాను. (శ్రోత్ర స్యశ్రోత్రం). అహం=నేను, వివిక్తరూపః=రూపము లేని వాడను, అయినను, విజానామి=చక్కగ తెలియగలను, (అశరీరం శరీరేషు), మమ=నన్ను, వేత్తా=తెలియువాడు, న+చ+అస్తి=మరి యెవడు లేడు. చిత్+సదా+అహమ్= నేను ఎల్లపుడు చైతన్యస్వరూపుడను. జ్ఞాన స్వరూపుడను. జ్ఞానమును జ్ఞానము తెలిసికొనగలదు గాని, ఇతరముల వలన వల్లపడదు.

ఆత్మకు అవయవములు లేవు. కాని, ఆత్మశక్తివలన, అవయవములెల్ల పనిచేయుచున్నవి. ఇంద్రియములు లేవు. అతని అధిష్ఠానమువలన ఇంద్రియములు తెలియుచున్నవి. మనసు లేదు. అతని చైతన్యము సోకుటవలన మనసు చింతించ గలుగుచున్నది. రూపము లేదు. అన్ని రూపములలో ఆత్మ అస్తి, భాతి, ప్రియం, అను లక్షణములతో వెలయుచుండుట వలన, రూపములు కనబడుచున్నవి. అతడు జ్ఞాన స్వరూపుడు.

22. వేదైరనేకైరహమేవ వేద్యో
వేదాన్తకృద్వేదవిదేవ చాహమ్।
న పుణ్య పాపే మమ నాస్తినాశో
న జన్మ దేహేన్ద్రియ బుద్ధిరస్తి॥

గీతా XV—15. మున, ఈ మొదటి పాదము పూర్తిగ నున్నది.

వేదైరనేకైః=వేదములనేకములు గలవు. నాలుగు వేదములే కావు. తెలియవలసిన ప్రతి విషయము వేద మనబడును. అవి అసంఖ్యాకములుగ నున్నవి. అన్ని యున్నను, వాటిని తెలియు తెలివి, అహ మేవ=నేనే, వేరు తెలివి లేదు. వేదాంతకృత్=వేదాంతములు, అనగా ఉప నిషత్తులనేకములు గలవు. వాటిని అనేక ఋషులు బోధించి యుండినను, ఆ ఋషుల రూపమున బోధించినది, ప్రకటించినది "నేను". వేదవిత్=ఋషులమూలమున, వేదములను, వేదాంతములను, కూడ గ్రహించి, తెలిసి నది కూడ, శిష్యుల రూపమునందుండిన నా తెలివియే. అట్లు తెలియు తెలివియే నేను. న+పుణ్యాపాపే=పుణ్యాపాప ములవలన, మమ+న+అస్తి+నాశః=నాకు నాశము లేదు. నేను కార్యములు చేయువాడను కాను. వాటి వలని పుణ్యా పాపములు నాకు లేవు. న+జన్మ+దేహ ఇన్ద్రియ+బుద్ధిః+ అస్తి=నాకు జన్మము లేదు, జన్మము కలుగుటకు దేహము

లేదు, దేహము లేదు గనుక, నాకు ఇంద్రియములు లేవు, మనసు లేదు, బుద్ధి లేదు, నేను సాక్షిని, చిన్మాత్రుడను.

23. న భూమి రాపో న చ వహ్ని రస్తి
న చానిలో మేఽస్తి న చాంబరం చ!

మే=నాకు నాది యనబడు, భూమి+న=భూమి లేదు, న చ ఆపః=నీరు కూడ లేదు. న చ వహ్ని అస్తి=అగ్ని కూడ లేదు. న చ అనిలః=వాయువు కూడ లేదు. న చ అంబరం=ఆకాశము కూడ లేదు. ఈ పంచ మహాభూతములగు, ఆకాశము, వాయువు, అగ్ని, జలం, పృథ్వి, నేను కాను. అవి నావికాను అయినను, నేను లేక ఇవి యుండజాలవు.

24. ఏవం విదిత్వాపరమాత్మరూపం
గుహాశయంనిష్కళమద్వితీయమ్!
సమస్తసాక్షిం సదసద్విహీనం
ప్రయాతిశుద్ధం పరమాత్మ రూపమ్॥
ఇతి ప్రథమః ఖణ్డః॥.

గీతయందు XV-19— "యోమామేవమ సంమూఢో జానాతి పురుషోత్తమమ్" అని యున్నది. పరమాత్మ రూపం=పరబ్రహ్మము, ఆత్మ స్వరూపము, ఏవం విదిత్వా= ఈరీతి తెలిసి, ఎట్లనగా, సంక్షేపముగి మరల బోధించు చున్నాడు. గుహాశయం=హృదయగుహాయందుండు వాడని, ("సర్వస్య చాహం హృది సంనివిష్టః" గీతా XV-15.)

(హృదయకుహర మధ్యే కేవలం బ్రహ్మమాత్రం)-నిష్కళం= కళంకములు సోకనివాడు, అద్వితీయం=అనన్యస్వరూపుడు, తనకు తానే పోలిక, ఇతరములేదు. సమస్తసాక్షిం=చరాచరజగత్తుకు సాక్షి, జాగ్రత్స్వప్నసుషుప్తులకుసాక్షి, శరీరత్రయములకు సాక్షి, గుణత్రయములకుసాక్షి, సదసద్విహీనం=సత్తు, అసత్తు అను భేదవిభేదములకు అతీతము. శుద్ధం=నిర్మలుడు, శుద్ధసత్వప్రధాన గుణముగలవాడు. అట్టివానిని తెలియుట వలన, ప్రయాతి పరమాత్మరూపమ్=ఆ పరమాత్మయే తానగుచున్నాడు. పరమాత్మరూపము తాను పొందుచున్నాడు.

అని ప్రథమ భాగము, సమాప్తము.

యఃశతరుద్రీయమధీతే
సోఽగ్నిపూతో భవతి,
సురాపానాత్పూతో భవతి,
బ్రహ్మహత్యాత్పూతో భవతి,
కృత్యాఽకృత్యాత్పూతో భవతి,
తస్మాదవిముక్తమాశ్రితో భవతి ।
అత్యాశ్రమీసర్వదాసకృద్వాజపేత్ ॥

యః=ఎవడు, శతరుద్రీయమధీతే = యజుర్వేదమునగల శతరుద్రీయమనబడు పరమాత్మస్తుతి కలదో దానికి తుల్యమగు ఈ ఉపనిషత్తును అధ్యయనము చేయుచున్నాడో, సః=

అతడు, అగ్నిపూతో భవతి = యజ్ఞములు చేసినంతటి పునీతు డగుచున్నాడు. సురా పానాత్పూతో భవతి = యాగములు చేసియు, సోమపానము చేసిన దోషమునుండి పునీతుడగు చున్నాడు. బ్రహ్మహత్యాత్పూతో భవతి, = బ్రహ్మహత్య = అనగా, ఆత్మజ్ఞానము పొందక, తన స్వస్వరూపము విచా రించక. (ఆత్మానం హినస్తి అజ్ఞానముననే దేహమును దుర్వినియోగపరచి నశింపజేయుచున్నాడో అట్టివాడు ఆత్మ హత్యచేసినవాడగును. బ్రహ్మహత్యచేసిన వాడగును. ఆ దోషము ఇందువలన తొలగుచున్నది. ఆత్మజ్ఞానము కలుగు చున్నది. కృత్యాఽకృత్యాత్పూతో భవతి = చేసిన కృత్య ములవలన కలుగు దోషము, చేయక వదలిన కార్యములవలని లోపములు, తొలగుచున్నవి.—అనగా, స్వస్వరూపజ్ఞానము పొందిన, ఆత్మజ్ఞానము పొందిన, జ్ఞానికి, కృత్యములు లేవు. అకృత్యములు లేవు అన్నిటికి అతడు సాక్షి. పామరుల కన్వ యించుధర్మనిబంధనలు అతనికి ఆపాదించవు. వాటి వలన అతడు పతితుడగుట లేదు. పావనుడగుట లేదు. తస్మాత్ = గనుక, అవిముక్త మాశ్రితో భవతి—అవి ముక్తం, = బంధముక్తులు రెండుయు లేని, మహేశ్వరుని, పరమాత్మను, ఆశ్రితో భవతి = పొందినవాడగుచున్నాడు. అత్యాశ్రమీ (భూత్వా) = ఆశ్రమ చతుష్టయములను అతిక్రమించి, బ్రహ్మచారి యని, గృహస్థు డని, వానప్రస్థుడని, సన్యాసియని, నాకు తగునో, తగదో యని, అనుమానించక, సర్వసంశయరహితుడై (తురీయాతీత

స్థానము వహించి) సర్వదా=ఎల్లప్పుడు, (అథవా=లేని పక్షమున), సకృద్వా=ఒకొకప్పుడుగాని, జపేత్=పునశ్చరణము చేయుచుండవలెను. మరల మరల జపించుచుండవలెను. విచారించుచుండవలెను.

అనేనజ్ఞానమాప్నోతి,
సంసారార్ణవనాశనమ్।
తస్మాదేవంవిదిత్వైనం
కైవల్యంపదమశ్నుతే।
కైవల్యం పదమశ్నుత ఇతి॥

ఇత్యథర్వవేదీయాకైవల్యోపనిషత్ సమాప్తా॥

అనేన=ఈ రీతి పరి శ్రమ జేయుటవలన, నిరంతర స్మరణ వలన, జ్ఞానమాప్నోతి,=జ్ఞానము కలుగును. అజ్ఞానము తొలగును. జీవభావము వీడును. మరణ భీతిపోవును. జ్ఞానము క్రొత్తగా వచ్చునది కాదు. అజ్ఞానము, ఆవరణము తొలగిన, మేఘములు తొలగినపుడు సూర్యుడు ప్రకాశించునట్లు, జ్ఞానము ప్రకాశించును. సంసారార్ణవనాశనమ్=ఆత్మ జ్ఞానము లేక పోవుటవలన, సంసారము కలిగెను. బంధ హేతువాయెను. ఆత్మజ్ఞానమువలన, భవబంధములు తొలగుచున్నవి. మరల జన్మము కలుగు నను భీతి తొలుగును. జన్మము వలన సంసారము కలుగును. జన్మ నాశము వలన సంసారనాశము కలుగును. తస్మాద్=అందువలన, ఏవం=

ఈరీతి, ఏనం=ఈ ఆత్మను, విదిత్వా=అనుభవసిద్ధముగ నెఱి గుటవలన, కైవల్యం=కేవలం, ఏకమేవాద్వితీయం, బ్రహ్మ మును, పదమశ్నుతే=ఉత్తమ పదవిని, శాంతం, శివం, సుందరం, అను పదవిని, సత్తు, చిత్తు, ఆనందము, అను పదవిని, పొందుచున్నారు. బ్రహ్మమే వారగుచున్నారు.

కైవల్య పదవి పొందుచున్నారు.

ఓం. తత్ సత్ !!!

ఓం సహనావవతు, సహనౌభునక్తు, సహవీర్యం కరవావహై,
తేజస్వినా వధీతమస్తు మా విద్విషావహై ॥

ఓం శాన్తిః! శాన్తిః!! శాన్తిః!!!

THE GITA PRESS, MADRAS-1

# నిర్వాణ షట్కం

మనోబుద్ధ్యహంకార చిత్తాని నాహం
న చ శ్రోత్ర జిహ్వే న చ ఘ్రాణ నేత్రే!
న చ వ్యోమ భూమిర్న తేజో న వాయుః
చిదానన్ద రూప శ్శివోఽహమ్ శివోఽహమ్॥ 1

న చ ప్రాణ సంజ్ఞో న వై పఞ్చవాయు
ర్న వా సప్తధాతుర్న వా పఞ్చ కోశః।
న వాక్పాణి పాదౌ న చోపస్థ పాయుః
చిదానన్ద రూప శ్శివోఽహం శివోఽహమ్॥ 2

న మే ద్వేషరాగౌ న మే లోభ మోహౌ
మదో నైవ మే నైవ మాత్సర్య భావః।
న ధర్మో న చార్థో న కామో న మోక్షః
చిదానన్ద రూప శ్శివోఽహం శివోఽహమ్॥ 3

న పుణ్యం న పాపం న సౌఖ్యం న దుఃఖమ్
న మన్త్రో న తీర్థో న వేదా న యజ్ఞాః।
అహం భోజనం నైవ భోజ్యం న భోక్తా
చిదానన్ద రూప శ్శివోఽహం శ్శివోఽహమ్॥ 4

న మే మృత్యుశఙ్కా నమే జాతి భేదః
పితా నైవ మే నైవ మాతా న జన్మ।
న బన్ధుర్న మిత్రం గురుర్నైవ శిష్యః
చిదానన్ద రూప శ్శివోఽహం శివోఽహమ్॥ 5

అహం నిర్వికల్పో నిరాకార రూపో
విభుత్వాచ్చ సర్వత్ర సర్వేన్ద్రియాణామ్।
న చాసంగతం నైవ ముక్తిర్న బన్ధః
చిదానన్ద రూప శ్శివోఽహం శ్శివోఽహమ్॥ 6